# అభివ్యక్తి

(నాలుగు వ్యాసాలు)



గౌరవ్

Publishers
Science 'n' Society
HighwayBookBank1023MobileSchoolSociety
GodavariDts

# అంకితం

ముష్కరుల చేతుల్లో రాలిపోయిన
మరో అక్షర ఖడ్గం, **గౌరిలంకేశ్వర్**కి
అశ్రునయనాలతో...



# అభివ్యక్తి

**(వ్యాస సంపుటి)**

గౌరవ్

ముద్రణ : సెప్టెంబర్ 2017

ప్రతులు : 1023

₹. 10/-

ప్రతులకు : 93 9999 1023

"Whatever his particular work, the writer is a singular and lonely person. In the small hours of the night, tearing out of himself his particular story, he is perhaps more alone than almost any other person can be. He is the prisoner of his thoughts and fancies and visions, and he must struggle with them, capture them and order them into a structural whole. No matter how bad a writer he is, he is still a creature of conscience and if dedicated to the truth as he may see such truth within his own limitations; and no small part of his being less than a great writer is the result of limitations, both inner and outer, in his search for the truth."

– Howard Fast
*The Naked God*

# ముందుమాట

చిన్నప్పుడు మా ఊరి లైబ్రరీతో కుస్తీ పడుతున్న రోజులు... అబ్బాస్ రాసిన **ఇంక్విలాబ్** బొజ్జబంతిలా దొరికింది. ఆసాంతం నమిలేసా. స్వాతంత్ర్యోద్యమం నాటి రోజుల్ని నా కళ్ళముందు మల్టీప్లెక్స్‌లో చూపించిందా నవల. ఆ ఉత్తేజం ఊదరగొడుతూంటే ఆగకుండా పరిగెత్తాను. దారిలో మార్క్స్ కంటబడ్డాడు. దాస్ కేపిటల్‌తో వెంటపడ్డాడు.

"It was in books that i encountered the universe... I had found my religion; nothing seemed to me more important than a book. i regarded the library of a temple"[1] అంటాడు సార్త్రే. అలా తరగతిగది గోడల్నీ, పాఠ్యపుస్తకాల్నీ, దొడ్డిదారిన చూడాల్సిన సినిమాల్ని, ఈతకొట్టడానికి మా మిత్రబృందం చుట్టుప్రక్క గ్రామాల్లో కేటాయించిన కాలవలు, చెరువుల్నీ, అప్పుడప్పుడే పరిచయమౌతున్న బీడీసిగరెట్ల సావాసాల్ని అన్నింటినీ పుస్తకాలు దిగమింగాయి.

ఇజాలన్నీ నన్ను మింగాలని చూసినా గదమాయించి ఊరుకోబెట్టాను. నిజాల్ని తెల్సుకోవడం ప్రమాదకరమని తెల్సి కూడా మేధోమధనం చేస్తూ కొండెక్కాను. ప్రవహించే చైతన్యాన్ని ఆపడమంటే ఉదయించే సూర్యుడ్ని మెప్పించడానికి బాకా ఊదడమేనని ఆలస్యంగా తెల్సుకున్నాను. ఆటుపోట్ల ఆర్థిక పరిస్థితి ఎప్పటికప్పుడు జీవితాన్ని అదుపు చేయాలని చూసినా నేను లొంగలేదు సరికదా మొండిగా ఎదురు తిరిగాను. వెన్నుదన్ను లేని రోజుల్లో వెన్నుపూసని నమ్ముకుని ముందుకెళ్ళిన సందర్భాలన్నీ విలువయిన అనుభవాల్ని నాకు అందించాయి. కోలుకోలేని ఎదురుదెబ్బలు వరుసగా తగులుతున్నా నిబద్ధతను నిలబెట్టుకోడానికి నిజాయితీగా ప్రయత్నించే అంత తెగును ఆ ప్రయోగాలే నాకిచ్చాయి. ఫ్రాంక్లిన్ అన్నట్లు "Reading was the only amusement I allow'd myself."[2] అలా ఆ కాలంలో పుస్తకాలే ప్రియనేస్తాలుగా ఆసన్నహస్తంతో ఆదుకున్నాయి.

ఠాగూరు ఏక్‌తా చలోరే గీతానికి రజనీకాంత్‌రావుగారు రేడియోలో చేసిన తెలుగు అను సృజనలో మిత్రులు మహెూదయ గారు చెప్పినట్లు, “ఒక్కడివే సాగవోయీ, నీ ఒక్కడివే సాగవోయీ” అంటూ ఒంటరి అభాగ్యుడ్ని ఉత్తేజపరుస్తాడు. ఏమాత్రం తెగువలేని బీడు బతుకుల్లోంచీ, అస్పష్టమయిన కసి, కోపం, ద్వేషం కలగలిసిన వ్యక్తిగత ఉద్రేకాల లోంచీ, ఆస్తీ-అంతస్తూ, విలాసాలు - విషాదాల సుడిగుండాల్లోంచీ, కులమతాల ఎడబాటులోంచీ నన్ను బయటికిలాగి నన్నొక మనిషిగా తీర్చిదిద్దిన కళాసాహిత్య సాంస్కృతిక ప్రజా ఉద్యమాలన్నింటికీ నేను శిరసు వంచి మనస్ఫూర్తిగా నా నమోవాకాలు సమర్పిస్తున్నాను. "I am not sure that I exist, actually. I am all the writing that

I have read, all the people that I have met, all the women that I have loved; all the cities I have visited."[3] అంటాడు జార్జ్‌లూయిస్ బోర్హ్స్.

ఆధ్యాత్మికత నించీ అరాజకత్వం వరకూ అనేక సంవాదాల సంఘర్షణ నిరంతరం నన్ను వెన్నాడేది. ఎన్నో రకాల అన్వేషణలు వంతులవారిగా దోబూచులాడేవి. ఇప్పటికీ చుట్టుముట్టిన అవాంఛనీయతలు అడ్డుతగులుతూనే ఉంటాయి. బయటపడే మార్గం కోసం ఎప్పటికప్పుడు చేసే ప్రయత్నాల సారమే కొత్త ప్రయోగాలకొక ఊతమిస్తుంది. సంకుచితత్వాల్ని అధిగమించి సాగిపోవడమే సమర్థనీయ జీవితానికి అర్థం, పరమార్థం. ఆ క్రమంలో పోట్లాటలు, పోరాటాలు, కోట్లాటలు, కుతంత్రాలు ఎదురుకాక మానవు. మనల్ని పరీక్షించికాని వదలవు. నెహ్రూ అన్నట్లు "the wheel of change moves on...."[4] కాలచక్రం ఎవరికోసమూ ఆగదు. దాంట్లో మన పరిమిత పరిధిలో ప్రపంచాన్ని పరికించి, పరిశీలించి తెచ్చుకున్న స్పష్టతతో మంచివైపు నిలబడి బలపర్చడానికి భక్తితో కూడిన భజనలు, పుణ్యాలు పునర్జన్మలు అవసరం లేదు.

– గౌరవ్

References:


1. The words, Autobiography of Jean-paul Sartre. Translated from the French by Bernard Frechtman, George Braziller, Newyork. Page – 51, 59.
2. The Autobiography of Benjamin Franklin, Maple Press Noida, Page- 135.
3. The more beautiful world own hearts known is possible. by charles Eisenstein, Banyan tree - 2015, Page - 15.
4. Glimpses of world History by Jawharlal Nehru, published by J.N. Memorial fund, New Delhi - 1997, Preface to original edition Jan-1, 1934.

# సైన్సు ఉద్యమం - మన కర్తవ్యం

భక్తిమతాలు పెంపొందినంత స్థాయిలో వ్యవస్థలో సైన్సు సెక్యులరిజాలు పెంపొందలేదనేదో చేదు వాస్తవం. కొద్దోగొప్పో పెరిగాయని అందరూ అనుకుంటున్న సైన్సు ఫలాలు అనుభవించడానికి పనికొచ్చినంతగా జనాల్లో ఆలోచించడానికి పనికిరావడం లేదు. నిత్యజీవితంలో భౌతికంగా ప్రతీ అంశాన్నీ సైన్సు వల్లనే పొందుతన్న ప్రజలకి, మానసికంగా మాత్రం మతాలకి దాస్యం చేసే రోగం అబ్బింది.. ఈ వ్యాధిని వ్యాపింపజేస్తున్న వారిలో విద్యాధికులూ, కుహనా మేధావులే ముందుండటం మన దౌర్భాగ్యం. భగవంతుడనే భావనను దోపిడీకి, మోసానికీ పర్యాయంగా వాడే క్రమంలో, ఈ దేశపు ఆధ్యాత్మికత ఐహికం గురించీ ఎన్ని ఉన్నతమయిన కబుర్లు చెప్పినప్పటికీ ఆచరణలో కొన్ని వర్గాల ప్రయోజనాల్ని మాత్రమే రక్షించడానికి సృష్టించబడిందనేదో నిజం. అందుకే మనకి ఎందుకో తెలీకుండా పాటించే ఆచారాలకి అంతే లేదు.

జీవితానికి సంబంధించిన ఎరుక సమాజంతో ముడిపడి వుంటుంది. సమాజానికి చెందిన చైతన్యం శాస్త్రీయాలోచనల్లో వెల్లడౌతుంది. అలా వెల్లడైన శాస్త్రీయ ఆవిష్కరణల్ని శాస్త్రప్రచారం కోసం కాక అశాస్త్రీయ విషయాల కోసం ఉపయోగించుకోవడం జరుగుబాటు కోసం సమాజాన్ని మోసం చేస్తున్న పరాన్న భుక్కుల జిత్తులమారితనానికి ప్రతీక. సైన్సు ప్రయోజనాలపై జీవితాల్ని కొనసాగించే సమాజం, అతీతశక్తుల్ని ఆరాధించడంలో కల ఆంతర్యమిదే. హేతుబద్ధమయిన ఆలోచనారీతుల్ని ఎంతగా అభివృద్ధి చేసుకున్నప్పటికీ, హేతువిరుద్ధమైన సంగతుల్ని హేతువు సాయంతోనే ప్రసారం చేయచూడటం ప్రపంచంలో ఈరోజు నడుస్తున్న బడా వ్యాపారం. దానిని నిర్లజ్జగా పెంచిపోషిస్తోంది పాలకులు, బ్యూరోక్రసీ, మీడియా మాధ్యమాలు. అందులో భాగమే సైన్స్ వ్యతిరేకోద్యమాలు.

విజ్ఞానశాస్త్ర ఫలితాల్ని ఉపయోగించుకునే మతాలన్నీ అజ్ఞానంలోనే ప్రజానీకాన్ని ఉంచాలనే ఒక బలమైన లక్ష్యానికి కట్టుబడి వుండడంతో, భౌతికంగా ఎన్నో నీతుల్ని పాటిస్తున్నామనుకునే భక్తజనం అంతిమంగా అశాస్త్రీయతను అవలంభించే బలహీనులుగానే మిగిలిపోతున్నారు. విద్యార్థి దశనుండే అనేక విధాలైన అసమానతల్ని రుద్దే ఈ వ్యవస్థలో, పాటించబడుతోన్న ప్రతీ మూఢాచారాన్ని సైన్సు

పదజాలాన్ని ప్రయోగించీ విజయవంతంగా ఎలా సమర్ధించుకోవాలనే దానికి బాల్యం నుంచే శిక్షణ ఇవ్వడం జరుగుతోంది. అందులో భాగంగానే యోగాధ్యానం మొదలుకుని పూజాప్రార్థనల ద్వారా ప్రతీ మతిమాలిన కార్యక్రమానికీ మహత్యాన్ని శాస్త్ర పరిభాషలో అంటకట్టడమొక జాఢ్యంగా అమలౌతోంది.

జనాల మెదళ్ళని తొలవడమే ప్రధాన ఆదాయవనరుగా కల మతాలు భావజాలాన్ని శతాబ్దాల క్రితమే పటిష్టంగా నిర్మించుకోవడంలో సఫలమవబట్టే, నేటికీ లక్షలాది భక్తులు కోట్లాది సొమ్ములు ఖర్చుపెట్టి దుర్మార్గమైన ఈ మత వ్యవస్థను పెంచి పోషించడం జరుగుతోంది. రోజురోజుకీ విధ్వంసక రీతిలో విశృంఖలత్వాన్ని వ్యాప్తి చేస్తున్న సాంకేతికత మానవీయ రీతిలో తనని తాను మల్చుకున్న రోజున మతాల ఆటకట్టక మానదు. ఏమాత్రం సమాజానికి స్పృహ కలిగినా, ఈ దోపిడీ సంస్కృతిని తుదముట్టించడానికి వెనుకాడదు. అంతదాకా వ్యక్తి-సంస్థలు పరిమితుల్ని గుర్తించి వర్గస్పృహతో కూడిన శాస్త్ర ప్రచారోద్యమాల్ని విస్తృత స్థాయిలో వీలైనంత విశాల ప్రాతిపదికతో నిబద్ధతగా నిర్మించడానికి తమవంతు నిజాయితీగా ప్రయత్నించడానికి మించిన కర్తవ్యం మరేదీ లేదు.

---

# అస్తిత్వ స్పృహాకొక శుద్ధి
# ఆంతరిక భావాల వృద్ధి
# అభివ్యక్తి

విభిన్నతని స్వాగతించలేని సమాజం విషపాత్రను అందించినప్పుడు సోక్రటీసుకు అనిపించిన విషయంలోని సారమది,

మానవతను కాంక్షించలేని అమానుషత్వం జీసస్‌ను అంతమొందించినప్పుడు లోకానికి ఆయన బోధించిన భావమది,

నాగరికతను సహించలేని చవకబారుతనం మహమ్మద్‌ను బాధించినప్పుడు ఆధునికతకు ఆయన ప్రసాదించిన వాదమది,

ప్రపంచమంతా ఎదురుచూస్తున్న విశేషజ్ఞాన సంపదను మతాలతో నిమిత్తం లేని మానవతకై నినాదించిన ఉపనిషత్ నినాదమది,

బుద్ధుడితో మొదలెట్టి అంబేద్కర్ వరకూ, ఫూలేతో ప్రారంభించి గాంధీదాకా ఎంతో మంది మహనీయుల త్యాగాలకి చారిత్రక గుర్తు,

**'అభివ్యక్తి'**

మానవ నాగరికతకి భావ వ్యక్తీకరణ ఒక ప్రధాన సాధనం. సామాజిక భావాభివృద్ధికీ, సాంస్కృతిక భాషాభివృద్ధికీ అభివ్యక్తి ఒక మౌలిక లక్షణం. మానవాళి లక్షల సంవత్సరాల పరిణామ క్రమంలో జంతుజాలం నుండి విడివడి వడివడిగా సముపార్జించుకున్న గుణం అభివ్యక్తి. అందుకే అభివ్యక్తి ఒక సామూహిక సంపద. వ్యక్తీకరణని వృద్ధి చేసుకున్న సమాజం ఎంతగా పురోగమిస్తుందో చరిత్ర పొడుగునా కనిపిస్తుంది. అందుకనే భారత రాజ్యాంగం అభివ్యక్తిలో భాగంగా వాక్స్వాతంత్ర్యాన్నీ, స్వేచ్ఛను, సమానవత్వాన్నీ గుర్తించింది. అంతటి మహత్తరమయిన మానవీయ నాగరికత విలువల్ని కాపాడుకోవడం కోసం బరితెగించిన మతోన్మాదానికి వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా పురస్కారాల్ని తిరస్కరించి వెనక్కిచ్చిన 200 మంది రచయితలు మొదలుకుని సుమారు వెయ్యిమంది వివిధ రాష్ట్రాల రచయితలు హేతువాదులు, కళాకారులు, మేధావులు తలపెట్టిన కార్యక్రమం అభివ్యక్తి.

నవంబరు 18, 19, 20 తేదీల్లో గోవాలోని మడ్‌గావ్‌లో మూడ్రోజులపాటు దక్షిణాయన్ అభియాన్ ఆధ్వర్యంలో, దక్షిణాయన్ రాష్ట్రీయ పరిషద్ సారథ్యంలో జరిగిన సదస్సు ఒక గొప్ప ప్రయత్నం. 1910లో సామాజిక విప్లవానికి నాందీ ప్రస్థానం పలికి దేవదాసీ వ్యవస్థ నిర్మూలనకై జీవితాంతం పాటుపడి 'గోమంటక్ మరాటా సమాజ్' ఉద్యమాన్ని నిర్మించీ, గోవా మొత్తాన్ని ప్రభావితం చేసీ, 'మీకోన్' అనే అత్యంత వివాదాస్పద ఆత్మకథ రాసిన రాజారామ్ రంగాజీ పైంజిన్‌కర్ (1884–1983), రచయితగా, వైద్యుడిగా, ఆర్థికవేత్తగా, విజ్ఞానశాస్త్రవేత్తగా, పోర్చుగీసు పార్లమెంటు సభ్యుడిగా అన్నింటినీమించి స్వేచ్ఛా స్వాతంత్ర్యాల్ని అభిలాషించిన 'మేధావుల చక్రవర్తి' (ది ప్రిన్స్ ఆఫ్ ఇంటలెక్చువల్స్) ఫ్రాన్సిస్ లూయిస్ గోమస్ (1829–1869), గొప్ప సంస్కరణవాదిగా బహుజనోద్ధారకుడిగా పేరొంది గోవా మొట్టమొదటి ముఖ్యమంత్రిగా ఎన్నో విద్యా, సాంఘిక, ఆర్థిక, సాహిత్య, సాంస్కృతిక వికాసాలకి తోడ్పడిన దయానంద్ బాలకృష్ణ బండోడ్ కర్ (1911–1973), గోవా రాష్ట్రంలో 'నాభిక్ సమాజ్' నుంచొచ్చి గ్రంథాలయోద్యమాన్ని ప్రారంభించీ 1907లో మాలాలో 'మహాలక్ష్మి వచనాలయా'న్ని ప్రారంభించీ, 1921లో పాంజీలో వెనుకబడ్డ కులాలవారి పిల్లలకోసం, పాఠశాల తెరిచి విద్యా, సామాజిక, సాంస్కృతిక రంగాల్లో ప్రగతిశీల ఆలోచనాధార ఆవిర్భవించడానికి అంకురార్పణ చేసిన నానూ తార్కర్ పెడెనేకర్ (1879–1940), బహుముఖ బౌద్ధ మేధావిగా, రచయితగా, పాళీభాషా నిపుణుడిగా, హార్వర్డ్, లెనిన్‌గ్రాడ్ విశ్వవిద్యాలయాచార్యుడిగా, స్వాతంత్రోద్యమకారుడిగా, నిత్యాన్వేషిగా పేరొందిన ఆచార్య ధర్మానంద దామోదర కోశాంబి (1876–1947), గోవా మొదటి శాసనసభా స్పీకరుగా, చరిత్రకారుడిగా, పాత్రికేయుడిగా, పరిశోదకుడిగా, లాయరుగా, మరాఠీ భాషావేత్తగా, మరాఠి, కొంకణి, ఇంగ్లీషు, పోర్చుగీస్ భాషల్లో అనేక గ్రంథాలు రాసిన రచయితగా అంగోలా స్వాతంత్ర్య సమరయోధుడిగా చెప్పుకునే పాండురంగ్ పురుషోత్తమ్ షిరోడ్‌కర్ (1916–2000) మొదలయిన మహామహుల స్ఫూర్తితో ఆయా వ్యక్తుల పేర్లని గౌరవ సూచకంగా వేదికలకి పెట్టి ప్రారంభించిన సమావేశం ఆద్యంతం ఆసక్తికరంగా సాగింది.

మొదటిరోజు మతోన్మాదుల చేతుల్లో దారుణంగా హత్య చేయబడిన డా॥ నరేంద్ర దభోల్కర్ కుమారుడు హమిద్ దభోల్కర్, గోవింద పన్సారే కుమార్తె

మేఘపన్సారే, డా॥ ఎం.ఎం. కల్బుర్గి మేనల్లుడు లింగప్ప కల్బుర్గి మొదలగువారి ఆధ్వర్యంలో ఆహుతులంతా మడ్‌గావ్‌లోని రవీంద్రభవన్ నుంచీ లోహియా మైదానానికి 'నిశ్శబ్ద యాత్ర' చేస్తూ మౌనంగా వెళ్ళడం జరిగింది. లోహియా మైదానంలో జరిగిన బహిరంగ సభలో 98లో గోవాలో జరిగిన బాంబు కేసులోని నిందితులే నరేంద్ర దభోల్కర్, కల్బుర్గి పన్సారేల కేసుల్లో ముద్దాయిలుగా ఉన్నారనీ, ఆనాడే వారిపై సరయిన చర్య చట్టం తీసుకునుంటే దభోల్కర్, పన్సారే, కల్బుర్గీలు జీవించి ఉండేవారన్నారు. వారితోబాటూ, ఆత్మాజీత్‌సింగ్, ధనాజీగురౌ, నీలా, మనిషీజైనీ, గణేష్‌దేవీ మొదలగువారు ప్రసంగించి శ్రోతల్ని ఉత్తేజపరుస్తూ మతోన్మాదాన్ని మట్టుపెట్టాల్సిన ఆవశ్యకతను నొక్కి చెప్పారు. "వేర్ ద మైండ్ ఈజ్ వితౌట్ ఫియర్" అన్న ఠాగూరు మాటలతో ఉన్న ప్లకార్డులతో సాగిన ప్రదర్శన చాలా మంది దృష్టినాకర్షించింది. ఆ మర్నాడు కె.కె. చక్రవర్తి అధ్యక్షతన, దత్తానాయక్ స్వాగతోపన్యాసంతో మొదలైన సభలో రచయిత్రి మహాశ్వేతాదేవికి అంకితమివ్వబడ్డ సావనీర్ 'సంతర్'తో బాటూ వివిధ గ్రంథాల్ని ఆవిష్కరించడం జరిగింది. గత 20 సం॥రాలుగా గుజరాత్‌లోని ఆదివాసులతో పనిచేస్తూ వివిధ భాషా, సాహిత్య, సాంస్కృతిక కళారంగాల ప్రగతి శీలాభివృద్ధికై కృషి చేస్తున్న రచయితా, మేధావి, దక్షిణాయణ్ ఉద్యమ సారధి జి.ఎన్.దేవీకి ఇటలీలోని యూనివర్శిటీ ఆఫ్ నెపిల్స్ (డిపార్ట్‌మెంట్ డిస్టుడీ లిట్టరై లింగ్విస్టా ఇ కంపెర్టీ) స్కాలర్ ప్రొఫెసర్ సివోకా రోసెల్లాకి మధ్య జరిగిన సంభాషణ (ఇంటర్వ్యూ)తో సహా కళ గురించి సుబోధ్ కేర్కర్, కొంకణీ భాషా పుట్టుక గురించి డా॥ నందకుమార్ కామత్, బౌద్ధ మధ్యేమార్గం గురించి దత్తా దామోదర్ నాయక్, మొదలగువారి వ్యాసాలు, రిపోర్టులు సావనీర్‌లో ఉన్నాయి. పంజాబ్ థియేటర్ ఆర్టిస్ట్, కర్నాటక దళిత కళామండల్ వారి సాంస్కృతిక కార్యక్రమాలతో బాటు దాదాపు 14 సం॥రాల కృషితో ఆనంద్ పట్వర్ధన్ స్వయంగా వివరించిన చలనచిత్రం 'జై భీమ్ కామ్రేడ్' అందరినీ ఆకట్టుకుంది. స్త్రీల రుతుస్రావ బహిష్కారం, నేత్ర - అవయవ - శరీర దానాలపై అవగాహనా, యితర చర్చలు, కవి సమ్మేళనాలు జరిగాయి. ఇక చివరిరోజు కాశ్మీరు సమస్య, మీడియా–సెన్సార్‌షిప్, మూఢనమ్మకాలు - హేతువాదం మొదలగు అంశాలపై వక్తలు మాట్లాడి ఇంతటి కార్యక్రమాన్ని విజయవంతంగా నిర్వహించిన దత్త దామోదర్ నాయక్, గణేష్ దేవీల

కృషిని అభినందిస్తూ మతోన్మాదాన్ని వ్యతిరేకిస్తూ, నరేంద్ర దభోల్కర్, గోవింద పన్సారే, కల్బుర్గిల హంతకుల్ని వెంటనే అరెస్టు చేయాలనీ డిమాండ్ చేస్తూ తొమ్మిది తీర్మానాలతో సదస్సును ముగించారు.

మిత్రులు అజయ్‌షేక్ అనారోగ్యంతో హైద్రాబాద్‌లో ఉండగా అనుకోకుండా చెప్పిన సమాచారం, మతోన్మాదాన్ని వ్యతిరేకిస్తూ మానవత వైపు నిలబడే ప్రతి ఒక్క పక్షాన్నీ బలపరచాలనే నా తపన కారణంగా గణేష్ దేవీగారితో పలు దఫాలు చర్చించిన పిమ్మట ఈ సదస్సులో పాల్గోవడం జరిగింది. ఆంధ్ర / తెలంగాణాల నుండి ఒక ప్రతినిధిగా వారందించిన అద్భుతమయిన ఆతిధ్యాన్నీ, గోవా అందాల్నీ, రుచుల్నీ అడక్కుండానే పరిచయం చేసుకుని గోవా లైబ్రరీని, మ్యూజియంనీ తిప్పి చూపించీ మిగిలినవెలా వెళ్లాలో మేప్‌గీసిచ్చి మరీ వివరించిన లాలూ పొటేకర్‌కీ నా ప్రత్యేక ధన్యవాదాలు. మార్టిన్ లూథర్‌కింగ్ అన్నట్లు కొద్దిమంది చేసే హింసకంటే కూడా అనేకమందిగానున్న వారి మౌనమే సమాజానికి ప్రమాదకరమని రుజువవుతున్న ఇలాంటి పరిస్థితుల్లో దక్షిణాయన్ వంటి ఉద్యమ సంస్థల ప్రయత్నాల్ని ప్రోత్సహించడం ఎంతైనా అవసరం. ఈ కార్యక్రమానికి వచ్చిన లింగప్ప కల్బుర్గి ప్రస్తుతం న్యూజిలాండ్‌లో ఉంటున్నారు. ఈ కార్యక్రమం కోసమాయన ప్రత్యేకంగా వొచ్చారు. కల్బుర్గి మరణానంతరం డా॥ వీరన్న రాజూర్ కన్నడలో రచించిన పుస్తకానికి 'ప్రొ॥ ఎమ్.ఎమ్. కల్బుర్గీ, ది ఆర్కిటెక్ట్ ఆఫ్ మహా మార్గ' ఆంగ్లంలో డా॥ సి.ఆర్. యరావింటెలీమఠ్ అనువాదాన్ని పంచారు. కాసేపు ఆయనతో మాట్లాడి వీలైతే దాన్ని తెలుగులో 'మహా మార్గదర్శి–కల్బుర్గి'గా అనువదిస్తానంటే ఆనందించారు. కల్బుర్గి ఒకచోటన్నట్లు, **"విజయం దీపావళయితే, అపజయం శివరాత్రి, మరణం మహానవమి, అదే నా విశ్వాసం. నేను మరణించడానికి జన్మించలేదు; సూర్య చంద్రులున్నంత కాలం నే జీవించి ఉంటాను."**

నిజమే. మనుషుల భావాల్ని ఎదుర్కొనే చేవలేక, బౌద్ధికంగా భావజాలాన్ని ఎదుర్కోవడం చాతకాక వార్ని భౌతికంగా లేకుండా చేయడం ద్వారా భావాల్ని చంపాలనుకోవడం బుద్ధిహీనుల పద్ధతికి నిదర్శనం. ఏ కాలంలో ఉన్మాదానికయినా సమిష్టి ఉద్యమాలే జవాబు కాగలవు. హేతువాద, మానవవాద స్వేచ్ఛాలోచనాపరులంతా ఇది గుర్తించి వారి బాధ్యతను విస్మరించకుండా విబేధాల కతీతంగా ఒక్కటవ్వాలని ఈ సందర్భంగా విజ్ఞప్తి చేస్తున్నాను.

అడ్డంగా తెగుతున్న తన తల గురించి కనీసంగానైనా పట్టించుకోకుండా నిజం గురించే తలపోసిన సత్యకామజాబాలి హత్య సాక్షిగా,

సత్యాన్ని సజీవంగా సమాధి చేయదల్చి బతికుండగానే రోమ్ నగరం మధ్యలో చితిపేర్చి చంపబడ్డ గియోనార్డో బ్రూనో చిహ్నంగా,

సమ సమాజం కోసం, సమాజంలోని సమానతా భావన కోసం అతి పిన్న వయస్సులోనే ఉరికంబమెక్కిన ఖుదీరాం బోస్, షహీద్ భగత్‌సింగ్, రాజ్‌గురు, సుఖ్‌దేవ్‌లే ఆదర్శంగా,

స్పార్టకస్ మొదలుకుని కార్ల్‌మార్క్స్ వరకూ గార్గినించీ కబీర్, తుకారాంల దాకా రినైజాన్స్ నుంచీ భక్తి ఉద్యమం దాకా ప్రతీదీ కచ్చితంగా,

**అభివ్యక్తే.**

అభివ్యక్తికోసం జరిగిన అవిరామ సంఘర్షణే.

మరి,

ఆటుపోట్లు, బుల్లెట్లు లెక్కచేయని

నిబద్ధతగల తరతరాల భావోద్యమ

భావజాల వారసులుగా దభోల్కర్,

పన్సారే, కల్బుర్గిల కర్తవ్యాన్ని ముందుకు

తీసుకెళదామా???

---

# నోట్ల రద్దు - ఒక చర్చ

- గౌరవ్

అర్థరాత్రి పాతనోట్ల రద్దు నిర్ణయం దేశవ్యాప్తంగా చర్చకు దారితీసింది. పాతికమంది విదేశీ నల్ల కుబేరుల్ని తాకే ధైర్యం లేని మోడీ సర్కారు నూట పాతిక కోట్ల మందిని అనాలోచితంగా ఇబ్బందికి లోనుచేయడం భావ్యం కాదనే వాదనను మరుగుపర్చడం కోసం, నోట్లరద్దుని గురించి ఆశాజనకంగా స్పందించి ఆ చర్యను సమర్థించకపోవడం దేశాన్ని అవమానించడమనేంత రీతిలో మీడియా సైతం ప్రవర్తిస్తోంది. ఇంతమంది సమర్థిస్తుండగా మాకేం రోగమనే మధ్య తరగతి మేధావులు మోదీని నెత్తినేసుకుని మరీ మోస్తున్నారు. ఇంతకీ జరిగిందేమిటి? ఒక మతోన్మాద ప్రభుత్వం ఆర్థికోన్మాదాన్ని ప్రదర్శించి అర్థాంతరంగా చలామణీలోనున్న పెద్ద నోట్లను రద్దు చేసింది. ఆర్థిక శాస్త్రంలో ఓనమాలు కూడా తెలీని మోదీ సర్కారు ఎవర్నీ సంప్రదించకుండా కనీసం నామమాత్రంగానైనా ప్రజాస్వామిక విలువలకు గౌరవం ఇవ్వకుండా ఈ దుశ్చర్యకు పాల్పడింది. అప్రజాస్వామ్యాన్ని సమర్థించిన వారందరిపైనా అప్రజాస్వామిక శక్తులని ముద్రవేసి తమ పబ్బం గడుపుకోవడం హిందూత్వవాదులకి అలవాటే. అదే తరహాలో ఉదయం లేచింది మొదలు మన నిత్య జీవితంలో దైనందిన అవశరాలు తీర్చుకోడానికి ఆధారపడే చిల్లర వర్తకులు, తోపుడుబండ్లవాళ్ళు, ఇంటింటికీ తిరిగి అమ్ముకునేవాళ్ళు, చోటా వ్యాపారులు, వ్యవసాయ-వలస కూలీలు, కుటుంబ సభ్యులపై కాక పింఛనుపై బతుకుతున్న వయోవృద్ధుల పరిస్థితి ఏమిటనే కనీస స్పృహ కూడా లేకుండా ఎలకల్ని పట్టలేక కొంపను తగలబెట్టినట్లు నల్లకుబేరుల్ని ఎదిరించే చేవలేక ప్రజలందరిపై ప్రతాపం చూపినట్లయింది. అకస్మాత్తుగా తీసుకున్న అప్రజాస్వామిక నిర్ణయాన్ని బలవంతంగా దేశమంతటిపై రుద్దడమే కాక, ఎన్ని ఇబ్బందులు పడైనాసరే నోరుమూసుకు పడుంటూ వీలైతే మేము కూడా ఈ చర్యను సమర్థిస్తున్నామని సిగ్గులేకుండా ప్రకటించుకోవడమొక మేధాప్రమాణంగా భావించేలా మధ్యతరగతి జనాల్ని పాలకులు నమ్మించగలిగారు. గుజరాత్‌లో కూడా హఠాత్తు సంఘటనల్ని సృష్టించి రక్తపుటేరులు పాలించిన మోడీ, తన ఉన్మాదాన్ని ప్రయోగాత్మకంగా ఆర్థికాంశంలో విజయవంతంగా అమలుచేసి ప్రజాస్వామ్య శక్తులన్నింటినీ మరోసారి అభద్రతాభావంలోనికి నెట్టి, అదే సత్తాగల సంస్కరణంటూ నమ్మిస్తున్నాడు. ఇది చాలా అన్యాయకరమయిన విషయం.

అధికారంలోకొచ్చిన మోదీ సర్కారు ముగ్గురు హేతువాదుల్ని పట్టపగలు హత్య చేసింది. ఇప్పటిదాకా హంతకుల్ని పట్టుకోవడం మాటలా ఉంచి, మూఢనమ్మకాల నిరోధక చట్టాన్ని దేశవ్యాప్తంగా తీసుకురావాలని హేతువాద సంఘాలు చేస్తున్న విజ్ఞప్తిని పట్టించుకోకపోగా, సాక్షాత్తూ ప్రభుత్వ కార్యాలయాల్నీ, అధికార కార్యక్రమాల్నీ హైందవతంతులుగా, మతవాద మేళాలుగా మార్చేయడం జరుగుతోంది. దేశంలో దళిత బహుజనులు, మైనారిటీలపై విస్తృతంగా జరుగుతున్న దాడుల్ని నివారించే చర్యలు తీసుకోకపోగా మేధావులు, కళాకారులు, రచయితలు అవార్డుల్ని వెనకిచ్చి ఛీకొట్టినా స్పందించని సర్కారు, దేశవ్యాప్తంగా మహిళలపై జరుగుతున్న దాడుల్ని గురించీ చట్టసభల్లో మొదలుకునీ ప్రసారమాధ్యమాల దాకా స్త్రీలని చులకనగా చూసే ధోరణిపై నోరు మెదపని ప్రభుత్వం, దేశవ్యాప్తంగా కరువుకోరల్లో చిక్కుకుని లక్షలాది అన్నదాతలు ఆత్మహత్యలు చేసుకుంటుంటే చీమకుట్టినట్లు కూడా లేని ఈ పాలకవర్గం, దేశంలోని యువత మత్తులో తూగాలనే కుట్రతో గ్రామాలు మొదలుకుని నగరాలదాకా అడుగడుగునా మద్యం, మాదక ద్రవ్యాలకు విచ్చలవిడి అనుమతులు అనధికారికంగా కూడా ఇచ్చి జనాల శవాలపై ఎక్సైజుశాఖని నడిపే దోపిడీ రాజ్యం, భిన్న రాజకీయ తాత్విక భావాలున్న వారి అస్తిత్వాన్ని కూడా తట్టుకోలేక వార్ని ఎన్‌కౌంటరు పేరుతో తుదముట్టిస్తూ కల్లబొల్లి కబుర్లు చెప్పే కుహనా పాలకగుణం, సమాజంలోని అసమానతల్ని అరికట్టేందుకు సొంతాస్తిని రద్దుచేసి భూమిని జాతీయం చేయలేక, దళితులు, బహుజన గిరిజన స్త్రీలపై జరిగిన దాడులపై చర్య తీసుకోలేక, క్రైస్తవుల్నీ, ముస్లిముల్నీ, కమ్యూనిస్టుల్నీ, సోషలిస్టుల్నీ సైద్ధాంతికంగా ఎదుర్కోలేక, వికలాంగుల అత్యాచార నిరోధక చట్టాన్ని తెచ్చే చేవలేక, మద్యపాన నిషేధాన్ని అమలుచేసే ధైర్యంలేక, అప్పనంగా ప్రకృతి వనరుల్ని కార్పొరేట్ కంపెనీలు స్వాహా చేస్తుంటే అడిగేందుకు మాటరాక సామాన్య ప్రజలెవ్వర్నీ ఆలోచించకుండా ఉండడం కోసం నోట్ల రద్దనే ఉన్మాదకర చర్యను తీసుకొని, ఆ చర్య ఎంత మంచిదో వాళ్ళే ప్రచారం చేసుకుంటున్నారు. తానే తుమ్మి తానే తథాస్తన్నట్లు నోట్ల రద్దుకుగానూ చేసిన ప్రత్నామ్యాయ ఏర్పాట్లు ఏవనే ప్రశ్నను తప్పించుకుంటూ, వెయ్యి రూపాయిల నోటు వల్ల నల్ల బకాసురులకి మేలైతే, మరి రెండువేల నోటెందుకన్న సవాలుని ఎదుర్కోలేక విమర్శకులపై అక్రమంగా దూషణదాడులు చేస్తున్నారు. సమాజ మంచి కోసం ఎంతిబ్బందిపడ్డా మంచిదేనన్న గుణాన్ని సామాన్య ప్రజలకు ప్రసారమాధ్యమాల ద్వారా కలిగించడం వలన, ప్రధాని

హోదాలో తీసుకోబడ్డ ప్రతీ ఉన్మాదకర నిర్ణయాన్నీ వ్యవస్థ బాగుకోసమనే భ్రమతో తలకి రుద్దించుకునే సంప్రదాయం మొదలవుతుంది. ప్రజాస్వామ్యానికిది మంచిది కాదు.

సమాజంలో 93% ఈ నిర్ణయాన్ని సమర్థించినట్లుగా జరుగుతున్న ప్రచారం కూడా ఒక కుట్ర. ఈరోజు దేశంలోని ప్రధాన ప్రసారమాధ్యమాలన్నీ కార్పోరేట్ శక్తుల చేతుల్లోనే ఉన్నాయి. అవి మోడీని మోయడం తప్ప ప్రశ్నించే ధైర్యం చేయలేవు. వారు తీసుకున్న నిర్ణయాన్ని ప్రజానీకంలో అత్యధికశాతం మంది అంగీకరిస్తున్నారనే విపరీత ప్రచారం వల్ల ఆ నిర్ణయంపై భిన్నాలోచనలు కలిగి ఉన్నవాళ్ళని భయభ్రాంతులకు గురిచేసే గోబెల్స్ ప్రచారం ఒంటబట్టిన ఈ ఖాకీలు నిక్కర్లొదిలి ప్యాంట్లు కట్టుకున్నారో లేదో అప్పుడే నాగరికులమైపోయామంటూ రెచ్చిపోతున్నారు. వ్యవస్థలోని సమస్యలన్నింటినీ గాలికొదిలి ప్రజానీకం ఆలోచనలన్నింటినీ చిల్లరమీద కేంద్రీకృతమయ్యేలా చేసి తమ పబ్బం గడుపుకోవాలనే ఈ చిల్లరగాళ్ళు చిల్లర నిర్ణయం తీసుకుని దేశవ్యాప్తంగా ఏదో పేదరికాన్ని నిర్మూలించే మహత్తర విప్లవాన్ని ప్రారంభించినట్లు విర్రవీగుతున్నారు. ప్రజల జీవన ప్రమాణాల్ని వృద్ధిచేసే సంక్షేమంపై ఏమాత్రం శ్రద్ధలేని ఈ బడాబాలులు, క్రమేణా దేశం మొత్తాన్నీ తమ ఉన్మాదానికి వత్తాసుపలికే దృక్పథం దిశగా మళ్ళించాలనుకుంటున్నా రనేది స్పష్టం. ఆ ఎత్తుగడలో భాగంగానే గుజరాత్, ఊరీ, లవ్‌జీహాదీ, నరేంద్ర దభోల్కర్, గోవింద పన్సారే, కల్బుర్గీల హత్యలు, ఘర్‌వాపసీ.... వంటి అమానుష అప్రజాస్వామిక ధోరణులకి కొనసాగింపుగా ఇప్పుడిలా పెద్దనోట్ల రద్దు నిర్ణయం తీసుకోవడం జరిగిందని ప్రగతిశీల శక్తులు అర్థం చేస్కోవాలి. మొత్తం కోట్లమంది దేశ ప్రజానీకంపై దీర్ఘకాలికంగా ప్రభావం చూపించే ముఖ్యమయిన ఒక నిర్ణయాన్ని తీసుకోవడం కూడా తనకి అలవాటైన ఒంటెద్దు పోకడనే పాటించడం చూసైనా ఈ ఉన్మాదులకి ప్రజాస్వామ్యంపై ఎంతమాత్రం గౌరవభావముందో అర్థం చేసుకోడానికి ప్రయత్నించొచ్చు. ప్రజాస్వామ్యంపై మోదీ సర్కారుకి గల అగౌరవానికి ఈ నిర్ణయం మరో తార్కాణమన్నది నిస్సందేహం.

---

# దేవుడూ - మొక్కులూ

ముఖ్యమంత్రులూ, ప్రధానమంత్రులు, న్యాయమూర్తులు, గవర్నర్లు... అప్పుడప్పుడూ మొక్కులు చెల్లించుకోవడం చూస్తూనే ఉన్నాం. ఏదైనా పనవ్వాలంటే ప్రభుత్వోద్యోగులకీ, నాయకులకీ ప్రజలు ఎలాగైతే నిత్యం మొక్కులు చెల్లించుకుంటున్నారో, అలాంటి మొక్కులూ, ముడుపులూ మరింత పెద్ద స్థాయిలో తమకి చెల్లించేలా, తమ కుటుంబమూ, బంధుమిత్రులంతా కూడా చల్లగా ఉండేలా చూడమని దేవుడికీ తెలంగాణ ముఖ్యమంత్రి మొక్కులు చెల్లించాడు. అధికారంలోకి వచ్చినప్పట్నుంచీ ముఖ్యమంత్రులిద్దరూ వంతులవారీగా దేవుడికి ముడుపులు చెల్లించడం చూస్తూనే ఉన్నాం. అన్నిసార్లు చెల్లించడమేం న్యాయమన్న వారిపై అంతెత్తున లేచే స్వామీజీల్ని చూస్తున్నాం.

రెండు తెలుగు రాష్ట్రాల ముఖ్యమంత్రులూ అధికారంలోకి రాకముందు ఇచ్చిన వాగ్దానాన్ని తీర్చమని అడిగినవారికి జవాబులేదు. అభివృద్ధి పేరుతో పేదల్ని, బడుగు బలహీన వర్గాల్ని దిక్కులేనివారిగా చేస్తూంటే ఏ దేవుడూ రాలేదు. రాష్ట్రంలో సగటున జరుగుతున్న రైతు ఆత్మహత్యల మీదా, ఆడవాళ్లపై అగాయిత్యాల మీదా ఏ దేవుడూ ఎప్పుడూ స్పందించినట్లు లేదు. సభల్నీ, సమావేశాల్నీ, కార్యకర్తల్నీ, ప్రజా ఉద్యమ కారుల్ని ఘోరంగా నిర్భందిస్తుంటే ఏ దేవుడూ రక్షించలేదు. ఎన్ని మొక్కులు చెల్లించయినా మహ్మద్ అఖ్లక్, రోహిత్ వేముల, గోవింద పన్సారే, కల్బుర్గీ, నరేంద్ర దభోల్కర్‌ల ఆశయాల్ని పాటించగలరేమో, వార్ని చంపిన హంతకుల్ని పట్టుకోగలరేమో పాలకులు చెప్పడం లేదు.

ప్రాజెక్టుల పేరుతో ఇరు తెలుగు రాష్ట్రాలు ప్రజల్ని నిర్వాసితుల్ని చేస్తున్నాయి. ఆ బాధ లేకుండా నీరందించేందుకు ముందుకొచ్చే ఏ దేవుడికయినా మొక్కులు చెల్లించమనండి. ఈనాటికీ గ్రామాల్లో నిరక్షరాస్యత, తాగునీటి సమస్య, మరుగుదొడ్లు, మూఢనమ్మకాలు, మొదలైనవి తాండవిస్తున్నాయి. వీటిల్లో ఏ సమస్యనైనా పరిష్కరించేందుకు ముందుకొచ్చే దేవుడ్ని మేం కూడా మొక్కుకుంటాం. రాష్ట్ర ముఖ్యమంత్రులుగా కమ్మా రెడ్డి దొరలు తప్పితే మిగిలిన కులాలవాళ్ళెవరినీ ఎందుకు అవకాశం దొరకడం లేదనే పంచాయితీని తీర్చమనండి, మేం కూడా ఆ దేవుడికి మొక్కులు చెల్లించుకుంటాం. ఏమాత్రం శ్రమ చేయని స్వామీజీల్ని, బాబాల్నీ దేశంలో పేదరికాన్నీ, అసమానతల్నీ, అవిద్యనీ అంతం చేసేయమనండి జీవితాంతం దేవుడికి భక్తులమై పడిఉంటాం.

ఇరు రాష్ట్రాల్లోని గిరిజన ప్రాంతాల్లోనూ ఏటా దోమకాటుకి బలై చనిపోతున్న ఆదివాసీల గోడును వినడానికి ఏం మొక్కుకున్నారో ఏలినవారు సెలవిస్తే బాగుండు. నగదు రహిత నిర్ణయాన్ని తీసుకుని సామాన్యుల జీవితాల్ని అతలాకుతలం చేయకుండా విదేశాల్లో నల్లధనాన్ని తీసుకురాడానికీ స్వామీజీలు, అమ్మలు, బాబాలు ఏం మొక్కులు చెల్లించాలో భాషిస్తే బావుణ్ణు. పిచ్చెత్తి తిరుగుతున్న నిరుద్యోగుల గోడుని వినిపించుకుని ఉద్యోగాలివ్వడం కోసం ఎన్ని మొక్కులు చెల్లించాలో తీర్మానం చేసి ప్రకటిస్తే ఇంకా బాగుంటుంది. అసలు దేవుడికి ఏ పని కోసం ఎంత లంచం ఇస్తామని మొక్కుకోవాలో వో లిస్టొకటి ప్రభుత్వం విడుదల చేసేస్తే మంచిదని మా అభిప్రాయం.

ఈసరికే లక్షలాదిమందిచ్చే మేలురకపు బొచ్చు మొదలుకుని వివిధ బహుమతులూ, విభిన్న సేవలూ, లంచాలూ మరిగిన దేవుడు చిన్న చిన్న సెటిల్‌మెంట్లపై విసిగెత్తిపోయినట్లున్నాడు, భారీ బంగారపు బహుమతులకే స్పందిస్తున్నాడు. అలా స్పందిస్తాడనే నమ్మకం తమ పాలన పున్యమా అని సడలుతున్న నిజం గ్రహించిన మంత్రులూ, మతాధిపతులూ మతంపై విశ్వాసం తగ్గడం ప్రభుత్వాల, మతాల అస్తిత్వానికే ప్రమాదమని గ్రహించి స్వయంగా రంగంలోకి దిగి 'ఇదిగో చూడండి – మేం నిజాయితీగా దేవుడి మొక్కులు ఎలా చెల్లిస్తున్నామో!' అని ఆచరణ ద్వారా ప్రకటిస్తున్నారు. లెక్కల్లేని సొమ్మంతా దేవుడిదేనని సామెత. అలా ఎంత అక్రమార్జన చేయకపోతే ఇంతలేసి ధనాన్నిలా మొక్కుల రూపంలో దేవుడికి లంచంగా చెల్లిస్తారనేది కూడా గమనార్హం.

అలా చూసినప్పుడు ఈ దేవుడు పాలకులకే దేవుడు కానీ ప్రజల దేవుడు కాడనే నిజం తెలుస్తుంది. సమాజంలో అనాదిగా దోపిడీ వర్గానికి, దోపిడీ కులానికీ, దోపిడీ మతానికి మాత్రమే కాపుకాసిన దేవుడనే భావనను ఇప్పుడిప్పుడే అర్థం చేసుకుంటున్న అణగారిన పీడిత ప్రజల మనోభావాల్ని మళ్ళీ గందరగోళపర్చి, కొద్దో గొప్పో క్రైస్తవ, ఇస్లాం మతాల దయతో బతికి బట్టకట్టిన వారి బుర్రల్లోకి తిరిగి ఆధిపత్య భావజాలాన్ని విషంగా ఎక్కించాలనే కుతంత్రంలో భాగమే ఈ మొక్కుబడి కార్యక్రమమని జనమంతా అర్థం చేసుకోవాలి.

ఇరువైపు గోడు విని కూడా బహుజనులపై కరుణ చూపకుండా అధికారం వైపుండేవాడు దొంగతొత్తవుతాడే కాని అందరి దేవుడూ కాదు, కాలేడు.

---